Regd. No. H.N.L. 18

14-5-1993 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 64 సంచిక :20 విడిప్రతి : రు. 2.00 లు

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట రామానాయుడు

**ఢిల్లీలో పివితో విరోధం, హైదరాబాదులో కోట్లతో సాన్నిహిత్యం**

## వైఎస్ తీరు అంతు బట్టడం లేదు!

కేంద్ర నాయకత్వానికి వ్యతిరేకంగా, రాష్ట్ర నాయకత్వానికి అనుకూలంగా "రాజకీయ ద్వంద్వనీతి"ని అనుసరిస్తున్న లోక్ సభ సభ్యుడు డాక్టర్ వై. ఎస్. రాజశేఖర్ రెడ్డి దోరణి ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి కి మింగుడు పడటం లేదు. ప్రధాన మంత్రి పి.వి. నరసింహా రావు పట్ల వ్యతిరేక వైఖరి నవలంబిస్తున్నప్పటికీ వై.ఎస్. ఎప్పుడూ బహిరంగంగా తిరుగుబాటు చేయలేదు. తన సన్నిహితుల దగ్గర పి.వి. గురించి ఎంత కఠినంగా మాట్లాడినా బయట మాత్రం పి.వి. ఆగ్రహానికి గురికాకుండా జాగ్రత్త పడ్డారు. పి.వి.కి వ్యతిరేకంగా పనిచేస్తున్న కేంద్రమంత్రి అర్జున్ సింగ్‌తో డాక్టర్ వై.ఎస్. సంబంధాలు అందరికీ తెలిసిందే.

కొరవ 8 పేజీలో

## మేలుకోకుంటే ప్రమాదం ముంచుకొచ్చేస్తుంది!

**కోవూరు ఉపఎన్నిక**

### కాంగ్రెస్ వాదులంతా కలసి పోరు సల్పితేనే గండం గట్టెక్కేది

కోవూరు ఉపఎన్నికకు పోలింగు తేది దగ్గర పడింది. కేవలం నాలుగు రోజులే వుంది ఎదం. ప్రచారాలూ ఒక రౌండు ముగిశాయి. ప్రధాన అభ్యర్థులందరూ ప్రతి గ్రామమూ సందర్శించారు. సభలు, మైకుల గోల వదలి పోలింగు ఏజెంట్ల నియామకం, ఓటర్ల జాబితాల పరామర్శలో పడిపోయి వున్నారిప్పుడు. తెలుగుదేశం హయాంలో జరిగిన కావలి ఉపఎన్నిక తర్వాత ఇంత వేడిగా, ఉడుకు పిడుకుగా ఉపఎన్నిక జరగడం ఇదే ప్రథమం. పోటీ హోరాహోరీగా, ముష్టాముష్టిగా వుంటుందని అర్థమై పోవడంతో ప్రతి పార్టీ ఉద్రిక్తంగా కన్పిస్తోంది. అది కోవూరు కాబట్టి, అక్కడ గ్రామ కక్షలు, పెత్తందారీ పోకడలు, రిగ్గింగు ప్రమాదాలు లేవు కాబట్టి, ఓటర్లు చైతన్య వంతులు కాబట్టి సరిపోయింది కాని; ఈ ఎన్నికలో ఏర్పడిన ఒత్తిడి ఇతర నియోజక వర్గాలలో అయితే ఈ పాటికి భూమాత రక్తంతో తడిసి వుండేదేమో నన్పిస్తుంది. ఆర్థికంగా, సామాజికంగా అభివృద్ధి చెందిన ప్రాంతాలలో రాజకీయం ఎంత అహింసాయుతంగా, ప్రజాస్వామ్య యుతంగా వుంటుందో తెలుసుకోవడానికి కోవూరే నిదర్శనం.

గెలుపుకు సంబంధించి కాంగ్రెస్, తెలుగుదేశం వర్గాలు రెండూ నిబ్బరంగానే వున్నాయి. ఎవరికి వారు రోజు రోజుకూ ఓటర్లు తమ వైపుకే మొగ్గు చూపుతున్నారన్న భ్రాంతిలో వున్నారు. సిపిఎం, బిజెపిలూ మేక పోతు గాంభీర్యంతో వున్నాయి కాని, వారి అంతరంగాలకు తెలుసు - తాము పోటీలో వెనుకబడి పోయామని. బిజెపికి మొదటి నుంచి ఆశ లేదు. ఓట్ల లెక్క చూసుకోవడం ఒక్కటే వారి ఉద్దేశ్యం. సిపిఎంకు మొదట మొదట మనసు ఉరఉర లాడింది - అసెంబ్లీ ప్రవేశార్హత దొరుకుతుందని. కాని కాంగ్రెస్, తెలుగుదేశం అపటెద్దులైతే, తాము లేగ దూడ మాదిరి మిగిలి పోతున్నామన్న నిజం వారికి క్రమక్రమంగా అర్థమౌతున్నది. 1983 నాటి కంటే ప్రజలలో తమ పార్టీ పట్ల అభిమానం పెరిగిందని, ఓట్ల సంఖ్య కూడా పెరిగి వుంటుందనే భ్రమలో వుండినారు వారు. ఈ పదేళ్లలో రష్యా, చైనాలలోనే కమ్యూనిజం పతనమై పోయినప్పుడు కోవూరులో మాత్రం ఎట్లా పెరుగుతుంది? కమ్యూనిస్టులు, జ్యోతిష్యులు ఒకే కోవకు చెందుతారు. ప్రపంచంలో ఎప్పుడేమేమి జరుగుతుందో, ఏ దేశంలో ఏ ప్రభుత్వానికి ఏమి జరుగనున్నదో వూహిస్తారు కాని, తామేమి కానున్నామో, తమకేమి జరుగనున్నదో కనిపెట్టలేరు. రేపు పోలింగులో 1983 నాటి సంఖ్యకు సమానంగా - 13 వేల ఓట్లు పోలైతే సిపిఎం 'విజయం' సాధించినట్లే లెక్క.

కాంగ్రెస్, తెలుగుదేశాలు తక్కెడలో చెరొక ప్రక్క మొగ్గు తగ్గు లేకుండా వున్నట్లున్నాయి. ఫోటో ఫినిష్ పరిస్థితుల్లో పోటీ పడుతున్నాయి. పరిస్థితి అంత ప్రమాదకరంగా వుండబట్టే, ఇంతకాలం ఇంటి పట్టున వుండిన శీనయ్య సతీమణి శ్రీమతి శ్రీ లక్ష్మమ్మ కూడా రంగ ప్రవేశం చేశారు. శీనయ్య సామభూతిని పరిపూర్ణంగా క్యాష్ చేసుకోవడం తాను ఓటర్లకు కన్పించి నప్పుడే వీలౌతుందని భావించి ఆమె కొరెక్కి తిరుగుతున్నట్లుంది. తెలుగుదేశం ప్రచారానికి ఈ మార్పు అదనపు ఆకర్షణ. ఆమె కంట బడితే ఆడవాళ్ల మనసులు అట్టే మైనపు ముద్దల మాదిరికరిగి పోతాయి కదా! ఎన్టీఆర్ రేపు 16 తేది రానున్నారు. ప్రచారం ముగింపు సభల్లో మాట్లాడ బోతున్నారు. చివరి దశలో ఎన్టీఆర్ రాక తమకు బలాన్ని చేకూర్చుతుందని తెలుగు దేశమాయుల విశ్వాసం. నల్లపరెడ్డి కుటుంబాలలోని స్త్రీలు, అభ్యర్థి ప్రసన్నకుమార రెడ్డి మొత్తం ఓటర్లను వ్యక్తిగతంగా కలిసి ఓట్లు అభ్యర్థించారు. నియోజక వర్గం చిన్నది కావడంతో ఇల్లిల్లూ తిరగడం వీలైంది. పోయిన చోటల్లా వారు చెప్పింది - శీనయ్య గురించే. నిధుల కొరత కూడా వారికి ఎదురైనట్లు లేదు. ఏ మాత్రం వెనుకా ముందు చూడకుండా ఖర్చుపెట్టారు. జెండాలు, గిండాలు లోపం లేకుండా సరఫరా చేశారు. ఎక్కడా నిరుత్సాహం, వ్యతిరేక వాతావరణం కన్పడక పోవడం వారి అదృష్టం. సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి వళ్లు వంచి పనిచేశారు. ప్రచార భారమంతా మోశారు. శరీరం గాలికి ఎగిరి పోయేదైనా, మనసు మాత్రం ఉక్కు వంటిది చంద్రమోహన్‌కు; ఆ క్రియ సంకల్ప . బలం ఈ ఉపఎన్నికకు ఉపకరించింది.

కాంగ్రెస్‌లో ఎందువల్లనో నీరసభావం తప్ప పరవళ్లు త్రొక్కి

కొరవ 5 పేజీలో

# పినాకి శరం

## అగ్ని పరీక్ష

కోవూరు ఉప ఎన్నిక కాంగ్రెస్‌కు అగ్ని పరీక్షగా పరిణమించింది. సంస్థకే కాదు, కాంగ్రెస్ వాడైన ప్రతి ఒక్కరికీ అగ్ని పరీక్ష; పరువు ప్రతిష్ఠలకు సంబంధించిన సమస్య; కొందరికైతే తల ఎత్తుకొని తిరగడమా, తలకు ముసుగు వేసుకొని మొహం తప్పించడమా అన్నంత చావు బ్రతుకుల సమస్యగా తయారైంది! మొత్తానికి పెద్ద వాడైన పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారు ఆకస్మాత్తుగా దూకి ఎందరినో ఎన్ని పరీక్షలకో గురి చేస్తున్నారు; ఎందరినో ఎన్ని రకాలు గానో నలిపి వేస్తున్నారు!

ఈ ఉపఎన్నికలో కాంగ్రెస్ కథ అద్యంతాలు అపసవ్యంగా, అపశ్రుతంగా వుంది. ఆ చర్చకు ఇది సమయమూ కాదు; సందర్భమూ కాదు. కాంగ్రెస్ అభ్యర్థిని గెలిపిస్తే ఆ తర్వాత వాటిని గూర్చి తీరిగ్గా తాపీగా మాట్లాడు కోవచ్చు!

నలుగురు అభ్యర్థులు పోటీలో వున్నప్పుడు సహజంగా కాంగ్రెస్ విజయం నల్లేరు మీద బండి లాగా సాగి పోయి వుండాలి. చతుర్ముఖ పోటీయే కాదు; పెళ్లకూరు ప్రత్యక్షంగా ప్రధాని అభ్యర్థి అనే పేరు వచ్చింది; ముఖ్యమంత్రికి ముఖ్యతనే ప్రతీతి కలిగింది; ప్రధాని స్వయంగా ఆదేశించి నందువల్ల పెళ్లకూరు విజయ భారాన్ని తన భుజస్కంధాల మీద వేసుకున్నట్లు ప్రకటిస్తూ, 110 డిగ్రీల నిప్పులు చెరిగే ఎండలో కూడా పండు వెన్నెల్లో వలె బంగారు కొండ మాగుంట సుబ్బరామరెడ్డి గారు తిరుగుతున్నారు. ఇవన్నీ కాక కోవూరుకు రెండు సార్లు ప్రాతినిధ్యం వహించి, ఆ తాలూకా ఆబాలగోపాలానికే కాదు, ప్రతి చెట్టు పుట్టకు కూడా సుపరిచితుడైన పెళ్లకూరు స్వయంగా పోటీ చేస్తున్నారు. ఇన్ని ప్రఖ్యాతులు, విఖ్యాతులు, అనుకూలాలు ఆడంబరాలు వున్నా కాంగ్రెస్ ఎలక్షన్ రథం గుంటలు గతుకుల బాటలో పడుతూ లేస్తూ పయనిస్తున్న దంటే విచిత్రంగా వుంది!

అవినీతి, అపకార వాద చరిత్ర; దూషణ, మేపుకు కోవూరు కోట అన్న సాంప్రదాయం గలవారు తెలుగుదేశం అభ్యర్థి; పోరాటపు ఆరాటాలతో అలసి పోయి పంథ్ల పటుత్వం సడలిన పులి సి.పి.ఎం. అభ్యర్థి; అయోధ్య తారక మంత్రంతో అమాయక ప్రజలను మంత్రించాలను కుంటున్న వారు బి.జె.పి. అభ్యర్థి. ప్రతిపక్ష అభ్యర్థులు ఇటువంటి వారైనప్పుడు సీనియర్ కాంగ్రెస్ వాడే కాకుండా, కేంద్రంలో, రాష్ట్రంలో కూడా అధికారంలో వున్న కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి గెలుపు సులభతరంగా వుండి వుండాలి. కాని పోలింగ్ ఇక ఐదు రోజులు మాత్రం వున్న నేడు కూడా – వాస్తవ పరిస్థితిని చూడ గలిగితే – ఆత్మ విశ్వాసంతో, గుండె మీద చేయి వేసుకొని మా అభ్యర్థి ఢంకా బజాయించి గెలుస్తారు అని కాంగ్రెస్ వాదులు చెప్పలేకున్నారు. ఎందువల్ల అనేది తర్వాత విశ్లేషణలో తేల్చు కుందాం!

ఎట్లా వస్తున్నదో ఏమో గాని కాంగ్రెస్ గెలుస్తుంది అనే మాట ఒకటి వినబడీ వినబడకుండా గాలిలో వ్యాపించి వుంది. చివరకు గెలుపు కాంగ్రెస్ దేనని పలువురి నోట వినబడుతున్నది. ఇది నిజం కావాలని కాంగ్రెస్ వాదిగా వుండే ప్రతి ఒక్కరూ కోరుకోవాలి. కోరుకొని కూర్చోవడం కాదు. యథా శక్తి యథారీతిలో కృషి చేయడం అవసరం. గాలి లేదు ధూళి లేదు. ఏ పార్టీ కుండే ఓట్లు వారికున్నాయి. కాంగ్రెస్‌కు వుండేవి స్థిరమైన ఓట్లు. తెలుగుదేశానికి ఖచ్చితమైన అభిమానులు కొందరు వుండవచ్చు గాని, మిత్రులందరూ కలసి వచ్చేటి బలం ఇప్పుడుండదు. సి.పి.ఎం., బి.జె.పి. అభిమానులు మారే వారు కాదు. ఇప్పుడు కొత్తగా వచ్చిన పరిణామ మేమంటే, తెలుగుదేశం అబ్బాయి దివంగతుడైన తన తండ్రి సానుభూతిని సొమ్ము చేసుకోవాలని తపన పడుతున్నారు. తన తండ్రి కాంగ్రెస్ ఎం.ఎల్.ఎ. గా మరణించాడని, తాను తెలుగుదేశం లోకి పుడాయించి తన తండ్రి ఆత్మకు అపచారం చేశాననే సూక్ష్మాన్ని అతను విస్మరిస్తున్నారు; కోవూరు ఓటర్లు ఈ వాస్తవాన్ని గ్రహించ లేనంత అవజ్ఞులు కాదని ఆ యువకుడు గ్రహించ లేకున్నారు. ఆయన స్థానమేమిటో, స్థావరమేదో ప్రసన్న కుమార రెడ్డికి ఈ ఎన్నిక ద్వారా తెలియజేయ గలిగితేనే కోవూరు ఓటర్లు తమ విజ్ఞత చాటు కున్నవారవుతారు. సి.పి.ఎం., బి.జె.పి.లు తల్లక్రిందులుగా తపస్సు చేసినా మన రాష్ట్రంలో అధికారానికి రాలేవు. కోవూరులో ఓటు వేయించుకొని, కోట అభివృద్ధి చేసుకునే వారి వల్ల, అధికారానికి రాలేని వారికి ఓటిచ్చిన దాని వల్ల ఏమి ప్రయోజనమో కోవూరు ఓటర్లు చక్కగా ఆలోచించ గలరని ఆశించవచ్చు.

కాంగ్రెస్‌కు వుండే స్థిరమైన ఓట్లకు తోడు, ఆ నియోజక వర్గానికి చెందిన కాంగ్రెస్ వాదులు, అక్కడ ఓటర్లతో స్నేహ బాంధవ్య అనుబంధాలు గల జిల్లాలోని ఇతర ప్రాంతాలలోని కాంగ్రెస్ వాదులు అదనంగా కొన్ని ఓట్లు పట్టుదలగా వేయించ గలిగితే కాంగ్రెస్ అభ్యర్థి విజయం సులభ తరమవుతుంది. అసంతృప్తి వుండవచ్చు; నిర్లక్ష్యం చేయబడుతుండవచ్చు; వచ్చే కీర్తంతా తమ సొంతం చేసుకోవాలనుకునే వారుండవచ్చు; ప్రత్యామ్నాయ నాయకత్వం కోవూరు ఎన్నిక నుండే ప్రావిర్భవించాలనే దుష్ట తలంపులు కలవారుండవచ్చు; కొందరిని అవమానిస్తుండవచ్చు కూడా. కాని వీరంతా ప్రస్తుతం కాంగ్రెస్ అభ్యర్థి విజయానికి అహరహం పాటు పడుతున్న వారనే యథార్థాన్ని గ్రహించడం అవసరం. అందువల్ల ఆ నియోజక వర్గం వారు గాని, బయట వారు గాని కాంగ్రెస్ వాదులందరూ అన్నీ దిగమ్రింగి కళ్లు మూసుకొని కష్ట పడి పని చేసి, వచ్చే ప్రతి ఓటును రాబట్టి, కాంగ్రెస్ అభ్యర్థికి దిగ్విజయాన్ని చేకూర్చాలి. ఏ మాత్రం దూరదృష్టి వున్నా తాత్కాలిక సంకుచిత తత్వానికి లోను గాక కాంగ్రెస్ అభ్యర్థి గెలుపులో కాంగ్రెస్ వాదులందరి శ్రేయస్సు ఆధార పడి వున్నదనే లోతైన రాజకీయ రహస్యాన్ని గ్రహించ గలిగితే పొరపాటు చెయ్యరు.

కోవూరు ఉపఎన్నిక పెట్టిన అగ్ని పరీక్షలో కాంగ్రెస్ వాదులు 'ర్యాంకు' తో ఉత్తీర్ణులు కాగలిగితే ఎంతబాగుంటుంది!!





# ఉత్తరక్రియలు

మా సోదరుడు

## తిక్కవరపు చంద్రమోహన్ రెడ్డి గారు

జగదేవిపేట



6.5.93 తేది గురువారం ఆకస్మికంగా స్వర్గస్థులైనారు. వారికి దైవ సన్నిధిలో చిరశాంతి కలగాలని ప్రార్థిస్తూ, వారి ఉత్తరక్రియలు 22-5-1993 తేది శనివారం పెద్దకర్మ, పొత్తర్లు నెల్లూరు, బాలాజీనగర్ Door No. 27/II-4 (18th Cross Road, పాత కరెంట్ ఆఫీసు రోడ్) లో జరుగును. కావున బంధుమిత్రులకు తెలుపడమైనది.

– తిక్కవరపు జనార్దన రెడ్డి

భార్య: నీరజ

చెల్లెలు–బావ: నిర్మల– బి. మోహన్ రెడ్డి

సమార్తె–అల్లుడు: నీలిమ–విడవలూరు విష్ణుమోహన్ రెడ్డి

బావమరిది: ఎం. గోపాల్‌రెడ్డి (గోపి)

# జమీన్‌రైతు

## రాజీనామా చేయాలి!

సుప్రీం కోర్టు న్యాయమూర్తి జస్టిస్ వి. రామస్వామి పై ప్రవేశ పెట్టిన అభిశంసన తీర్మానం వీగిపోయేట్లు ప్రవర్తించి కాంగ్రెస్ పార్టీ పెద్ద తప్పు చేసింది. పంజాబ్ అండ్ హర్యానా హై కోర్టు ప్రధాన న్యాయమూర్తిగా శ్రీ వి. రామస్వామి అవినీతికి పాల్పడ్డారని, కొన్ని లక్షల రూపాయల ప్రభుత్వ ధనాన్ని తన విలాసాల కోసం దుర్వినియోగం చేశారని ఆరోపణలు వచ్చాయి. సుప్రీం కోర్టు న్యాయమూర్తిగా ఆయన కొనసాగడానికి లేదని న్యాయవాదులు ఆందోళన చేశారు. ఆయన వున్న బెంచ్‌లను బహిష్కరించారు. పత్రికలలో పెద్ద దుమారం చెలరేగింది. పార్లమెంట్‌లోనూ చర్చ జరిగింది. ఇంత జరిగినా రామస్వామి పదవి వదలి పెట్టలేదు. గత లోక్ సభ స్పీకర్ ఈ సంఘటనల పై ఒక న్యాయమూర్తుల కమిటీ నియమించారు. ఆ కమిటీ విచారణకు సహకరించడానికి నిరాకరించడమే కాకుండా, కమిటీలోని న్యాయమూర్తులనూ అవినీతి పరులుగా వ్యాఖ్యానించి రామస్వామి మూర్ఖంగా ప్రవర్తించారు. అయితే కమిటీ మాత్రం తన విచారణ కొనసాగించి, రామస్వామి అవినీతిని సాక్ష్యాధారాలతో నిరూపించి, లోక్ సభకు నివేదిక సమర్పించింది. దాని ఆధారంగానే ఈ అభిశంసన తీర్మానం. లోక్ సభ చరిత్రలో ఒక న్యాయమూర్తిని అభిశంసించే తీర్మానం పై చర్చ జరగడం, కోర్టు ఏర్పాటు కావడం ఇదే ప్రథమం. రాజకీయ విభేదాలు విస్మరించి సిపిఎం, బిజెపి, జనతాదళ్ వంటి ప్రతిపక్షాలన్నీ తీర్మానాన్ని బలపరిస్తే, మెజారిటీ పార్టీ అయిన కాంగ్రెస్ ఓటింగ్‌కు గైర్ హాజరై తీర్మానం వీగిపోయేట్లు చేసింది. అభిశంసన అమలు జరగాలంటే రెండింట మూడు వంతుల మంది ఓటు చేయాలి; సగం మంది కంటే ఎక్కువ సభ్యులు హాజరు కావాలి. కాంగ్రెస్ గైర్ హాజర్ వల్ల సభలో సగం మంది కంటే తక్కువ సభ్యులు వుండడంతో తీర్మానం వీగిపోయింది.

ఏ కారణంతో కాంగ్రెస్ ఈ నిర్ణయం తీసుకున్నా, న్యాయ వ్యవస్థ అత్యున్నత ప్రమాణాల పట్ల ఆ పార్టీకి గౌరవం లేదనే భావమే ప్రజలలో కలుగుతున్నది. నేరస్తులను శిక్షించాల్సిన న్యాయమూర్తే నేరస్తుడని రుజువైతే, ఇక అతడిచ్చే తీర్పులకు ఏ పాటి విలువ వుంటుంది? తీర్మానం ఓటమితో రామస్వామి సాంకేతికంగా పదవిలో కొనసాగే హక్కు సంపాదించుకొని వుండవచ్చు; కాని, నైతికంగా ఆయన ఆ అవకాశం ఎప్పుడో కోల్పోయారు. ఇప్పటికైనా ఆయన తన తప్పు గ్రహించి తక్షణం పదవికి రాజీనామా చేస్తే కొద్దిగానైనా గౌరవం నిలుస్తుంది. లేకుంటే సుప్రీం కోర్టు పట్లనే ప్రజలలో గౌరవ, విశ్వాసాలు పలుచనై పోతాయి. ప్రధాని పి.వి. చొరవ తీసుకొని రామస్వామిని ఇంటికి సాగనంపాలి.

## తలతిక్క శేషన్!

రామస్వామి సుప్రీం కోర్టు పరువు తీస్తే – టిఎన్ శేషన్ ఎన్నికల సంఘాన్ని నవ్వుల పాలు జేస్తున్నారు. ఆయనది అవినీతి అయితే, ఈయనది తలతిక్క; ఆయనది అధికార దుర్వినియోగమైతే, ఈయనది అధికార దురహంకారం. ఎన్నికల సంఘం ఛైర్మెన్‌గా తన సర్వాధికారం చాటుకోవడానికి, తానెవరికీ లోబడి లేనని చెప్పుకోవడానికి, తాను తీసుకునే నిర్ణయాలను ఎవరూ నిరోధించ జాలరని రుజువు చేయడానికి గత రెండేళ్లుగా పలు తలతిక్క నిర్ణయాలు తీసుకొని ఎన్నికల వ్యవస్థను అవహేళన పాల్జేస్తున్నారు శేషన్. తాజాగా జరుగుతున్న ఉపఎన్నికలలో ఆయన దుందుడుకు ధోరణి మితి మీరి పోతున్నది. హర్యానాలోని కల్కా నియోజక వర్గంలో ఎన్నికను రద్దు చేసి హై కోర్టు, సుప్రీం కోర్టుల మధ్య బంతి ఆటకు కారణభూతుడైనాడు శేషన్. ఆ సమస్య అటుండగానే తమిళనాడులోని పళని, కేరళకు చెందిన ఒట్టపాళెం లోక్ సభ నియోజక వర్గాల ఉపఎన్నికను పోలింగు తేదికి పది రోజుల ముందు రద్దు చేసి పారేశాడు. దీనికాయన చెప్పిన కారణం – శాంతి భద్రతల సమస్య, కరువు. ఇవి రెండూ అప్పటి కప్పుడు పుట్టుకొని వచ్చే ఉపద్రవాలు కాదు. నిజంగా అవే కారణాలైతే ఎన్నికలే జరిపి వుండకూడదు. నామినేషన్ల నాడు లేని కరువు పోలింగు నాటికి వచ్చేస్తుందా? కాంగ్రెస్‌కు అనుకూలంగా లేవనే కారణంతోనే, తన అధికార దర్పం ప్రదర్శించాలనే దుగ్ధతోనే శేషన్ తీసుకున్న దుర్మార్గ నిర్ణయాలివి. దీనివల్ల అభ్యర్థులకు, ప్రభుత్వానికి ఎంత శ్రమ, ఖర్చు? శేషన్‌ను ఆ పదవి నుంచి దించి వేయాలని 1989 లో జనతాదళ్ ప్రభుత్వం సంకల్పించింది. అప్పటి నుంచి ప్రతి రాజకీయ పార్టీ ఆయన్ను అభిశంసించాలనే వాదిస్తున్నాయి. వారి ఆందోళన పెరిగే కొద్దీ ఈయన తలతిక్క పెరిగి పోతూంది. ఒక వ్యక్తి ఇష్టా ఇష్టాల పైన, చిత్తచాంచల్యం పైన ఆధారపడి పార్లమెంటు, శాసనసభల ఎన్నికలు జరగడం, నిల్చిపోవడం ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం పాల్జేయడమే! కాంగ్రెస్‌తో సహా రాజకీయ పార్టీలన్నీ సమైక్యంగా ఆలోచించి, సుదృఢ నిర్ణయం తీసుకొని, ఎన్నికల సంఘానికి పట్టిన గ్రహణం విడిపించడం అవసరం. శేషన్ తనంతట తాను పదవి నుంచి తప్పుకోకుంటే, అభిశంసన ద్వారానైనా తప్పించాలి.

## జమీన్‌రైతు

14.5.'43
4 పేజీలు అణా:

### నెల్లూరు ముచ్చట్లు

#### విఆర్ హై స్కూలు

సుబ్బరావు గారి మరణానంతరం హెడ్ మాస్టరు ఎవరా అనే ప్రశ్న ఉదయించింది.

ఈ హై స్కూలు ఈ మధ్య చెడిపోయినా చాలాకాలం మంచి పేరుతో యశస్సును గడించిన సంస్థ. మెరిట్‌ను బట్టి ఉపాధ్యాయుల సెలక్షన్ జరిగినంత వరకు బాగానే వుండింది. సిఫార్సులు, మొగమాటలు, తన – మన ఏర్పడ్డ తరువాత బొత్తుగా చెడ్డది. చాలా మంది పిల్లలు ఇతర హై స్కూళ్లకు వెళ్లుతున్నారు గూడ.

కాపున కమిటీ వారిని మేము వినయపూర్వకముగా ప్రార్థించేదేమనగా హెడ్ మాస్టరును సీనియారిటీని బట్టి గాని, సిఫార్సులను బట్టిగాని యేర్పాటు చేయక మెరిట్‌ను బట్టి నియమించ వలెననీ, అక్కడ మనకు దొరక్కపోయినా శ్రమపడి, విచారించి ఉత్తముణ్ణి సంపాయించమనీ, ప్రార్థిస్తున్నాము. ఇది మా వక్కరి అభిప్రాయం కాదు. అశేష ప్రజవాంఛించే ఉత్తమ కోరిక. యీ విషయంలో మీరు పప్పులో కాలేసి నారంటే ఉత్తమ విద్యా సంస్థను చేతులార నాశనం చేసినారనే అపఖ్యాతిని మీ పుత్రపౌత్ర పారం పర్యంతం శాశ్వతం జేసిన వారేగాక పాపపంకిల భయం గూడ ఉన్నది సుమా జాగ్రత్త!!

#### అల్లూరు కేసు

పోలీస్ స్టేషన్ తగులబెట్టిన కేసు అర్గుమెంటు జరుగుతున్నది. జడ్జిమెంటుకు ఇంకా 10 దినాలు పట్టవచ్చు.

-విమర్శకుడు

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

#### నెల్లూరు జి.జ.రై. సంఘ సమావేశము

పై సంఘము 12 తేది నెల్లూరులో సమావేశమై యీ క్రిందితీర్మానాలు గావించెను. క్రొత్త కార్యవర్గ ఎన్నికలు జరిగి శ్రీ బద్దెపూడి పేరారెడ్డి గారిని అధ్యక్షులుగను శ్రీ మహానంది చౌదరిని ప్రధాన కార్యదర్శిగాను, మరి పదముగ్గురిని కార్యవర్గ సభ్యులుగను ఎన్నుకొనిరి.

కొత్త యిర్రిగేషన్ బిల్లును సపోర్టు చేయుట, వెంకటగిరి ఫారెస్టు ఆక్టు నిరసించుట, ధరలు కంట్రోలు చేయరాదనుట, ప్రజారక్షణ సంఘాలు నెలకొల్పుమనుట; ఇవి విషయాలు.

#### నెల్లూరు బజారు ధరలు

మొలగొలుకులు

| | |
|---|---|
| పాతవి పుట్టి 1 కి | రు. 135-0-0 |
| కొత్తవి పుట్టి 1 కి | రు. 130-0-0 |
| ఈశ్వర్లు పుట్టి 1 కి | రు. 105-0-0 |
| కేసర్లు పుట్టి 1 కి | రు. 110-0-0 |
| రాగులు పుట్టి 1 కి | రు. 205-0-0 |
| వులవలు తూ. 1 కి | రు. 12-0-0 |
| పెసలు తూ. 1 కి | రు. 14-0-0 |
| మినుములు తూ. 1 కి | రు. 16-8-0 |
| తెల్లబియ్యం రు 1 కి. | 4 శేర్లు |
| సవర ధర (మద్రాసు) | 65-8-0 |
| వెండి తులం 1 కి | 1.60 |

#### సినిమా కబుర్లు

జెమిని వారి బాలనాగమ్మ 11.5.43 నుండి నెల్లూరు వినాయక హాల్లో ప్రదర్శింప పడుతుంది.

#### వాహిని ప్రొడక్షన్

ఇక వాహిని ప్రొడక్షన్ వారు ఫిలిం నిర్మాతలు గాను, వాహిని పిక్చర్సు వారు ఫిలిం డిస్ట్రిబ్యూటర్లు గాను ఉంటారని ఒక గాలి కబురు.

## పుస్తకాల ధరలిట్లా పెరిగిపోతే ప్రజల జిజ్ఞాస తీరేదెట్లా?

అన్నివస్తువుల మాదిరే పుస్తకాల ధరలుకూడా విపరీతంగా పెరిగి పోయాయి. సామాన్యుడిలో పుస్తకాలు కొనాలనే ఆకాంక్ష వున్నా కొనలేక పోతున్నారు. పుస్తకాల పబ్లిషర్లు లాభార్జనే ధ్యేయంగా వ్యవహరిస్తున్నారే తప్ప మరో వైపు నుంచి ఆలోచించడమే మానివేశారు. ప్రభుత్వమైనా ఈ విషయంలో చొరవ తీసుకొని ప్రజలు తెలుసుకో దగిన విషయాల ప్రచురించే పుస్తకాల పై తగు రాయితీలిచ్చి ప్రజల జిజ్ఞాస తీర్చాలి.

నెల్లూరు – నాగరాజు

### దూరదర్శన్‌లో ప్రసారం చేయాలి

రాష్ట్రంలో పేరు మోసిన వైష్ణవాలయాలలో నెల్లూరు శ్రీ తల్పగిరి రంగనాథస్వామి ఆలయం ఒకటి. తిరుపతి, భద్రాచలం, యాదగిరి గుట్ట, విజయవాడ కనకదుర్గమ్మ ఆలయాలకు సంబంధించిన బ్రహ్మోత్సవాలను దూరదర్శన్ వారు 'టెలికాస్ట్' చేస్తున్నారు. కాని ఎంతో వైభవంగా జరిగే నెల్లూరు రంగనాథ స్వామి వుత్సవాలు రాష్ట్ర ప్రజలు చూసే అవకాశం ఇంత వరకు కల్గలేదు. చిన్న చిన్న దేవాలయ బ్రహ్మోత్సవాలు కూడా చూపే టప్పుడు రంగడి పై నిర్లక్ష్యం ఎందువల్ల? దూరదర్శన్‌లో ప్రసారం విషయమై ఇప్పటి పాలక వర్గం తగిన శ్రద్ధ తీసుకోగలదని నా నమ్మకం.

నెల్లూరు – వి. రవి కుమార్

### నోటి దురుసు

బ్యాంకులలో కుదువ వుంచిన బంగారు ఆభరణాలలో తాళిబొట్లు కూడా వేలం వెయ్యడం బ్యాంకులు చేస్తున్న సిగ్గు మాలిన పని అని ఎమ్మెల్యే శ్రీ యలమంచలి శివాజీ విమర్శించడం శోచనీయం. బ్యాంకులలో తాకట్టుకు వచ్చిన తరువాత ఏ ఆభరణమైనా ఒకే విలువ. గడువు తీరిన తరువాత నగలు విడిపించుకుని వెళ్లక పోతే వేలం వెయ్యడం చట్ట ప్రకారం సమంజసమే. చట్ట సభల్లో వుండే గౌరవనీయుడైన సభ్యునికి ఈ చిన్న విషయం తెలియకుండా వుంటుందా? ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశించి ఇలాంటి ప్రకటన చేస్తే నోటి దురుసు అనిపించుకోవడం మినహా మరోక ప్రయోజనం వుండదు.

కోవూరు – ఎల్. సుధాకర్ రెడ్డి

### జనవాణి

### మిత్రపక్షాలలో భేదాలు రాకూడదు

మిత్రపక్షాలైన తెలుగుదేశం, సిపిఎం పార్టీలు కోవూరు నియోజక వర్గ వుపఎన్నికల్లో తమ పూర్వపు సర్దుబాటు నిర్ణయానికి వ్యతిరేకంగా పోటీకి దిగాయి. ఈ పరిస్థితుల్లో జిల్లా జనతాదళ్ అధ్యక్షుడు జిల్లా కమిటీని సమావేశ పరచకుండానే సిపిఎంకు మద్దతిస్తూ, తెలుగుదేశం అభ్యర్థిని విమర్శిస్తూ పత్రికల్లో ప్రకటనలు చేస్తున్నారు. రాష్ట్ర పార్టీ ఆదేశాలు లేకుండానే జిల్లా అధ్యక్షుడు ఈ విధమైన వైఖరి అనుసరిస్తుండడం వల్ల మిత్ర పక్షాల్లో అనవసర భేదాలకు ఆస్కారం కలుగుతుంది.

నెల్లూరు – ఎస్. రాయల్‌రెడ్డి

నెల్లూరీయులింత చచ్చు దద్దమ్మలా అని నలుగురూ నవ్వి పోతారు!

# తెలుగు విశ్వవిద్యాలయ కేంద్రం ఇస్తానన్నా తీసుకునే వారు లేరు!

తెలుగు విశ్వవిద్యాలయ కేంద్రం అంగట్లో అన్నీ వున్నాయి, అల్లుడి నోట్లో శని వుంది అన్న సామెత నెల్లూరుకు వర్తిస్తుంది. చెప్పుకోవడానికి, ఇతర ప్రాంతాల వారి చేత పొగడ్త లందడానికి ఎన్నో గొప్పలు, గర్వకారణాలు వున్నాయి గాని, చేతల విషయాని కొచ్చేసరికి నెల్లూరీయులు వుత్త వెధవాయిలోయ్ అని మన అంతరాత్మ మనను ఘోషిస్తుంటుంది!

నెల్లూరు ఏ రంగంలో ప్రఖ్యాతి గాంచలేదు చెప్పండి! సాహిత్య, సాంస్కృతిక, కళారంగాల్లో ప్రసిద్ధి చెందింది నెల్లూరు; రాజకీయంగా అనాదిగా వెలుగులో వుంటున్నది; వ్యవసాయకంగా ప్రసిద్ధమైంది నెల్లూరు; భూస్వాములనే కాదు, పదులు వందల కోట్లకు పడగలెత్తిన 'మ్యారిచ్' కి నిలయం నెల్లూరు; కాంట్రాక్టు రంగంలో కనుకట్టు విద్యా విశారదులైన బడాబడాలకు కాణాచి నెల్లూరు. కాని ఏం ప్రయోజనం – నెల్లూరు అభివృద్ధి విషయంలో ఆవాహన విసర్జన లేనప్పుడు ఎన్ని రంగాలలో ఎందరు గొప్ప వారుండీ ఏమి ప్రయోజనం? ఎందరు విద్యాధికులు, వ్యవహార దక్షులు వుండీ ఏమి లాభం?

నెల్లూరు వారి చచ్చుతనానికి అప్రయోజకత్వానికి, అనాసక్తత, నిర్లిప్తతలకు తాజాగా ఒక సాదృశ్యం వుదహరిస్తాను చూడండి- తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ఆచార్య పేర్వారం జగన్నాథం గారు నెల్లూరులో తమ విశ్వవిద్యాలయ కేంద్రాన్ని స్థాపించ నున్నామని ప్రకటించారు. ఇంత బాధ్యతతో కూడిన ముఖ్య విషయాన్ని వైస్ ఛాన్సలర్ తనకు తానుగా ప్రకటించడానికి వీలుండదు. దీనికి ఎవరి ప్రేరణో వుండాలి; అధికారేతర వ్యక్తుల ప్రేరణ కాదు, అధికారంలో వున్న వారి ప్రేరణ వుండి తీరాలి. విధాన నిర్ణయం చేయవలసింది ప్రభుత్వం; దాన్ని అమలు జరప వలసింది, పర్యవేక్షించ వలసింది తెలుగు

## ఒక మేధావి ఆవేదన!

విశ్వవిద్యాలయం; సహకరించ వలసింది స్థానిక పెద్దలు

జగన్నాథం గారు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ కాక ముందు కాకతీయ విశ్వవిద్యాలయంలో తెలుగు అధ్యాపకుడుగా, ఆచార్యుడుగా పనిచేశారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు ఆంధ్ర సాహిత్య అకాడమీ అధ్యక్షుడుగా వున్నప్పుడు జగన్నాథంగారు జాయింట్ సెక్రటరిగా వుంటూ, గోపాలరెడ్డి గారి అభిమానాన్ని చూరగొన్నారు. చాలా కాలం క్రితం జగన్నాథం గారి సోదరుడు శ్రీ పి. రాములు నెల్లూరు ఎస్.పి. గా వుండి పోయారు. జగన్నాథం గారికి నెల్లూరుతో మరో విధంగా సంబంధం లేదు; స్వతహాగా శ్రద్ధాసక్తులు వుండవలసిన అవసరం లేదు. నెల్లూరులో తెలుగు విశ్వవిద్యాలయం కేంద్ర స్థాపన విషయంలో ఆయన ఆ ప్రకటన చేయడానికి గోపాల రెడ్డి గారి ప్రేరణ ఏదైనా వున్నదా అంటే, పత్రికలో వైస్ ఛాన్సలర్ ప్రకటన చూసి గోపాలరెడ్డి గారికి ఆశ్చర్యం కల్గిందట. సాహిత్య సాంస్కృతిక విషయాలకు సంబంధించి ఆ మాత్రం ఆసక్తి వున్న వారెవరూ లేరు.

లోతుగా ఆరా తీస్తే తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా జగన్నాథం గారిని నియమించిన వాడు ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి. ఆ సమయంలో జనార్ధన రెడ్డి నెల్లూరులో విశ్వవిద్యాలయం కేంద్ర స్థాపనను గూర్చి వుత్తరువైనా చేసి వుండాలి, లేక నియామక సమయంలో జగన్నాథం గారికి తన అభిమతాన్ని తెలియజేసైనా వుండాలి. ఆయనకు తప్ప అటువంటి అభిరుచి, ఆసక్తి యితరుల కుండదు. ఎవరి అండైనా, ఆధారమైనా లేకుండా వైస్ ఛాన్సలర్ తనకు తానుగా అంత అధికారికంగా పత్రికా ప్రకటన చేసి వుండరు. నెల్లూరులో కేంద్ర స్థాపనకు ప్రేరణ శక్తియైన జనార్ధన రెడ్డి ముఖ్యమంత్రిత్వాన్ని పరిత్యజించ వలసి వచ్చింది. వైస్ ఛాన్సలర్ ప్రకటనకు నెల్లూరు పెద్ద లెవ్వరూ స్పందించలేదు. అందువల్లనే ఇప్పుడు ఆ వూసే లేకుండా

కొరవ 11 పేజీలో

స ఋ గు డు

## * వేలు కట్టించుకొనే ప్రైవేట్ చదువులంగళ్ళ కంటే, మామూలుగా నడిచే స్కూళ్ళలోనే మంచి రిజల్ట్స్ వచ్చాయి!

పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు అన్ని విధాలా వెనుక బడి పోయింది. ఒక్క ర్యాంకూ మన జిల్లా విద్యార్థులకు దక్కలేదు. అన్ని ర్యాంకులూ ఇతర జిల్లా వాసులే తన్నుక పోయారు. ఉత్తీర్ణతా శాతంలోనూ నెల్లూరు ఇతర జిల్లాల కంటె ఎంతో వెనుకబడి పోయింది. ఒంగోలు ఫస్టన నిలిస్తే, నెల్లూరు తొమ్మిదో స్థానానికి దిగజారి పోయింది. జిల్లాలో ఉత్తీర్ణతా శాతం కేవలం 37.17; రాష్ట్రం మొత్తం పైన వచ్చిన సగటు (45 శాతం) తో పోల్చినా ఇది సిగ్గుపడాల్సిన సంగతే!

రాష్ట్రంలో నెల్లూరును మించిన విద్యా వ్యాపార కేంద్రం మరొకటి లేదు. అప్పుడే పుట్టిన బిడ్డ నుంచి, గడ్డాలు మీసాలు పెరిగి ఉద్యోగాలు వెతుక్కునే వారి వరకు అన్ని వయస్సుల, అన్ని తరగతుల వారి విద్యావసరాలను అమ్మగల చొరవ, నేర్పు నెల్లూరీయులకే వున్నాయి. నెల్లూరు పేరు చెప్తే ఒకప్పుడు నాజూకు బియ్యం జ్ఞాపకానికి వచ్చేవి; శ్రీనాథుడి రోజుల్లోకి వెళ్తే నెల్లూరు నెరజాణలు మనసులో మెదలేవారు. ఇప్పుడు నెల్లూరు పేరు చెప్తే ఎంతటి వాడికైనా స్ఫురించేది కోచింగ్ సెంటర్లు, ప్రైవేటు కాలేజీలు, స్కూళ్లే! విజయవాడ, హైదరాబాదు వంటి మహా నగరాలలోనూ లేనంతటి సంఖ్యలో నెల్లూరులో చదువులంగళ్లున్నాయి. వేలకు వేలు ఫీజులుగా దండే ఖరీదైన ఫైవ్ స్టార్ కోచింగ్ సెంటర్లున్నాయి. తమ పిల్లలను బాగా చదివించుకోవాలనే తపన, ఆరాటం కల్గిన తల్లిదండ్రుల బలహీనతను అందమైన ప్రకటనలతో, కళ్లు మిరుమిట్లు గొల్పే ఆకర్షణలతో ఎక్స్‌ప్లాయిట్ చేసి కొల్లగొట్టే సరస్వతి వర్తకులున్నారు. ఇన్ని రెసిడెన్షియల్ స్కూళ్లు, కోచింగ్ సెంటర్లు, డే స్కూళ్లు, మిడ్ డే స్కూళ్లు వున్నా మన విద్యార్థు లెందు కంత

డోలేంద్ర

ఘోరంగా పరీక్షల్లో ఫెయిలైనారు; ఎందువల్ల ఒక్కరూ చెప్పుకో దగిన ర్యాంకు పొందేందుకు సరిపడా మార్కులు తెచ్చుకోలేక పోయారు?

ఈ చదువులంగళ్లలో పసి పిల్లలకు చదువు బోధించరు; చదువు పేరుతో బాధిస్తారు. పొద్దున ఆరు గంటల నుంచి రాత్రి 10 గంటల వరకు చదువే చదువు. పుస్తకాలు ముందేసి, బలవంతంగా నూరేసి, చదివిన పాఠాన్నే చదివించి, చెప్పిన ప్రశ్నల జవాబులే మళ్లీ మళ్లీ చెప్పించి, చేతులు విరిగి పోయేలా, పెనాలు అరిగి పోయేలా మళ్లీ మళ్లీ

కొరవ 11 పేజీలో

## ఉత్తరక్రియలు...

మా తల్లి

### కందలి శేషమ్మ గారు

5.5.93 తేది సాయంకాలం 5.30 గంటలకు స్వర్గస్తురాలైనది. వారి

**ఉత్తరక్రియలు**

**18.5.93** మంగళవారం - శిలా ప్రతిష్ఠ **19.5.93** బుధవారం – శిలోద్యాసన

రేపు – బ్రాహ్మణ బియ్యాలు

గూడూరు మండలం తిప్పవరప్పాడులోని మా స్వగృహమునందు జరుగును.

బంధుమిత్రులు తెలియగోరుతాము.

కుమారుడు: **కందలి పెంచలురెడ్డి,** కోడలు: **సులోచనమ్మ**

## ప్రకృతిలోని వైచిత్రిని తన కవితా కుసుమాల్లో నింపుకున్న

# మహాకవి రవీంద్రనాథ్ ఠాగూర్!

రవీంద్రనాథ్ ఠాగూర్ పై అధివక్త శ్రీ పి.వి. రమణారెడ్డికి అలివి కాని భక్తి. నెల్లరుకు సంబంధించి నంత వరకు డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి రవీంద్రుడి ప్రత్యక్ష శిష్యుడైతే, రమణారెడ్డి గారు ఏకలవ్య శిష్యుడు. ఆ భక్తి ప్రపూరితుడై, రమణారెడ్డి గారు ఏటా రవీంద్ర జయంతిని హార్దికంగా జరిపిస్తుంటారు. ఈ ఏటి సభలో, తిరుపతి విశ్వ విద్యాలయం

## జయంతి సభలో రమణీయ ప్రసంగం!

ఆంగ్ల శాఖ ప్రొఫెసర్ శ్రీ నాగేశ్వర రావు రవీంద్రుని రమణీయ దృష్టి అనే అంశం పై రమణీయ ప్రసంగం చేశారు. సృష్టిలోని అద్భుత వైచిత్రనం తటినీ తన కవితా కుసుమాల్లో నింపుకున్న మహాకవి రవీంద్రుడు అన్నారాయన. రవీంద్రుడు కవి, విమర్శకుడు, భావుకుడు, కథకుడు, సంగీత పరిజ్ఞానం కల్గిన వాడు, మానవతా విలువలు మూర్తీభవించిన మహామనిషి, బహుముఖ ప్రజ్ఞాశాలి అని ప్రశంసిస్తూ, భూమి నుంచి పచ్చిక పుట్టినట్లు, మొక్కలు ఆకులు తొడిగి పుష్పించినట్లు వుంటుంది, గీతాంజలి కావ్యం. ఆ మహా కావ్యం ఠాగూర్‌ను ప్రపంచ మానవుణ్ని చేసింది. ఆయన తర్వాత పశ్చిమాసియా దేశాలలో నోబుల్ బహుమతి పొందిన మరొకరు లేక

రవీంద్ర జయంతిలో, ప్రొఫెసర్ నాగేశ్వర రావుకు సత్కార మందజేస్తున్న పి.వి. రమణారెడ్డి; ప్రక్కన డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి

పోవడమే రవీంద్రుడి విశిష్టత; రవీంద్రుడి రెండు కవితలను జాతీయ గీతాలుగా స్వీకరించడం, ప్రపంచ చరిత్రలో ఏ కవికీ లభించని అపూర్వ గౌరవం అన్నారు నాగేశ్వర రావు గారు.

రవీంద్రుడి కవితలో ప్రకృతి రమణీయకత చిద్విలాసం చేస్తుంటుంది; ఆయన రచించిన 'జలపాతం నవ్వింది' అనే కవితలోని భావం వర్ణనాతీతం; ఈ జగత్తు నంతా ఒక పాటలో కూర్చి పాడడం ఆయనకే చెల్లింది అన్నారు ప్రొఫెసర్ గారు. రవీంద్రుని చండాలిక రూపకం, పోస్టాఫీసు నాటిక, కాబూలీ వాలా కథలు కలకాలం నిల్చిపోతాయని అభి భాషించారు.

కొరవ 11 పేజీలో

# నెల్లూరు రచ్చబల్ల

విశ్లేషకుడు

## ముఖ్యమంత్రి

ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి 15 తేది నెల్లూరు వస్తున్నారు. ఉదయం హైదరాబాదు నుండి మద్రాసు మీదుగా హెలికాప్టర్‌లో వస్తారు. ఆ రోజు మధ్యాహ్నం ఇందిరా భవన్‌లో శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి విందు.మధ్యాహ్నం విశ్రాంతి; అధికారులతో సమాలోచనలు. సాయంత్రం కోవూరు ఎన్నికల ప్రచార సభలు. రాత్రికి నెల్లూరు మకాం; 16తేది ఉదయం కారులో విజయవాడ పయనం.

## జనార్దన రెడ్డి

పూర్వపు ముఖ్యమంత్రి శ్రీ జనార్దన రెడ్డి 12 తేది నెల్లూరు వచ్చారు. పెంచలయ్య కుమార్తె వివాహానంతరం మధ్యాహ్నం 12గంటలవరకు సోమశిల గెస్టు హౌస్‌లో వుండి, భోజనానికి వాకాడు చేరుకున్నట్లున్నారు.

అసలు ఆయన కార్యక్రమం ప్రకారం 13, 14, 15 తేదులలో జి.కాం. ఏర్పాటు చేసే కార్యక్రమాల్లో పాల్గొని వుండాలి. 12 తేది కూడా సాయంత్రం వరకు నెల్లూరులో వుండి రాత్రికి వాకాడు పోయి వుండాలి. అటువంటి జనార్దన రెడ్డి హఠాత్తుగా 12 తేది మధ్యాహ్నమే ఎందుకు వాకాడు తిరిగి పోయారు? 13, 14 తేదులలో కూడా అక్కడే ఎందుకున్నారు? మా వుద్దేశ్యం – జి.కాం. ఏర్పాటు చేసే కార్యక్రమాలంటే కోవూరు కాంగ్రెస్ ప్రచార కార్యక్రమంగా వుండాలి. అటువంటి కార్యక్రమం ఏర్పాటులో జి.కాం. నిస్సహాయ మైందా? ఎన్నిక ప్రచార నిర్వాహకులు జనార్దన రెడ్డి ప్రచారం, ప్రమేయం అనవసర మనుకున్నారా? జనార్దన రెడ్డి గారు 15 తేది నెల్లూరు వస్తారు. ముఖ్యమంత్రి తోటి కోవూరుకు పోతారో లేదు తెలియదు. 16 తేది ఉదయం వెంకటగిరి, మధ్యాహ్నం 1 గంటకు మద్రాసు.

## ఓట్ల లెక్కింపు 21 తేది

కోవూరు నియోజక వర్గం ఓట్ల లెక్కింపు 21 తేది ఉదయం 8 గంటల నుండి పాలిటెక్నిక్ కాలేజిలో జరుగుతుంది. సాయంత్రానికి ఫలితాలు

## రామానాయుడు జయంతి

'జమీన్‌రైతు' స్థాపక సంపాదకుడు నెల్లూరు వెంకట్రామా నాయుడు జయంతి జూన్ 3 తేది సాయంత్రం జమీన్‌రైతు కార్యాలయ ఆవరణం లోనే (నిప్పో ఎదురుగా సావిత్రి నగర్ 3 వ క్రాసు రోడ్డు) ఆహ్లాదకరమైన సహజ వాతావరణంలో జరుగుతుంది.

ఈ సారి ఆంధ్రప్రభ వారపత్రికలో గత నలభై సంవత్సరాలుగా ప్రమదావనం శీర్షిక ద్వారా మహిళాలోకంలో చైతన్యం కల్గించిన జర్నలిస్టు ,విఖ్యాత నవలా రచయిత్రి శ్రీమతి మాలతి చందూర్ రామానాయుడు గారి అవార్డు స్వీకరిస్తారు. సభకు సమాచార పౌర సంబంధ శాఖా మాత్యులు శ్రీ పనబాక పెంచలయ్య అధ్యక్షత వహిస్తారు. ఈ సందర్భంలో జమీన్‌రైతు ప్రాంగణంలో నెలకొల్పబడుతున్న రామానాయుడు గారి విగ్రహాన్ని డాక్టరు బెజవాడ గోపాల రెడ్డి గారు ఆవిష్కరిస్తారు.

ఇతర వివరాలు తర్వాత :దూరాభారం అనుకోకుండా సభకు తప్పక హాజరు కావడానికి ఇప్పటి నుండే ఆయత్తం కావలసిందిగా మా అభిమాన లోకానికి విజ్ఞప్తి చేస్తున్నాము.

తెలుస్తాయి. మామూలు ప్రకారం, ఏ బూత్ కా బూతే ఓట్లు విడి విడిగా లెక్కిస్తారు. అన్నీ కుప్పబోసి లెక్క పెట్టాలని ఎన్టీఆర్ కోరారు కాని, శేషన్ ఇంకా ఏ నిర్ణయమూ తీసుకోలేదు.

ఎన్నికల రిటర్నింగ్ ఆఫీసర్ శ్రీ ఆదిత్యనాథ్ దాస్ సెలవు పై వెళ్లడంతో, కొత్త అధికారిగా గృహ నిర్మాణ సంస్థ ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ శ్రీమతి ఉదయలక్ష్మిని నియమించారు. సెక్యూరిటీ ఏర్పాట్లు విస్తృతంగా జరుగుతున్నాయి. ఒక్కొక్క మండలానికి ఒక డిఎస్‌పిని పర్యవేక్షకులుగా పెట్టి, గ్రామగ్రామాన పోలీసులను దింపుతున్నారు. సమస్యాత్మక గ్రామాలలో ఈ మొహరింపు మరీ ఎక్కువగా వుండబోతుంది. ప్రస్తుతానికి దాములమడుగు, పెనుబల్లి, అనెమడుగు, రామన్నపాళెం, మానేగుంట పాడులను ఈ కోవకు చెందినవిగా గుర్తించారు.

## 10 వ తరగతి ఫలితాలు

నెల్లూరు టవున్ లోని 29 హై స్కూళ్లలో అందినంత వరకు ఫలితాలు దిగువ ఇస్తున్నాము. బ్రాకెట్లలోనివి ఫస్ట్ క్లాసులు. నాలుగు హై స్కూళ్లు – మాతరన్ స్కూలు, రత్నం రెసిడెన్షియల్, నారాయణ రెసిడెన్షియల్, డాక్టర్ సి.వి. రామన్ హై స్కూళ్లు నూటికి నూరుపాళ్లు ఉత్తీర్ణత సాధించాయి. ఇవన్నీ ప్రయివేటు స్కూళ్లు కావడం గమనార్హం. ప్రయివేటు స్కూళ్ల మీద మోజు, అవి తామర తుంపరగా పెరిగి పోతుండడానికి ఈ ఫలితాల ఆకర్షణే కారణం గదా! జి.ప్ర.ప., మున్సిపల్ హై స్కూళ్లు కాస్తయినా సిగ్గు పడాలి; వాటితో పోటీకి ప్రయత్నించాలి!

| స్కూలు పేరు | పరీక్షకు కూర్చున్న వారు | ఉత్తీర్ణులు | శాతం |
|---|---|---|---|
| మాతరన్ స్కూలు | 14 | 14(14) | 100 |
| సి.వి. రామన్ | 11 | 11(9) | 100 |
| నారాయణ | 57 | 57(49) | 100 |
| రత్నం | 123 | 123(107) | 100 |
| సెంట్ జోసఫ్ (బా) | 102 | 99(91) | 97 |
| శారదా | 52 | 50(39) | 96 |
| సెంట్ జాన్స్ | 39 | 37(33) | 95 |
| స్వామిదాస్ | 118 | 110(86) | 93 |
| బాలాజీ విద్యాలయం | 22 | 20(17) | 91 |
| శాంతినికేతన్ | 34 | 32(26) | 90 |
| విశ్వభారతి | 14 | 12(11) | 90 |
| మూలపేట బాలికలు | 93 | 69(43) | 74 |
| పత్తివారి స్కూలు | 62 | 42(22) | 68 |
| సెంట్‌జోసఫ్ గరల్స్ | 115 | 74(49) | 64 |
| సెంట్ పీటర్స్ | 160 | 103(55) | 64 |
| ఎ.సి.నగర్ | 121 | 76(42) | 63 |
| ఆర్.ఎస్.ఆర్. | 144 | 73(44) | 47 |
| సి.ఎం.ఆర్. | 57 | 25(12) | 44 |
| వి.ఆర్. హై స్కూలు | 204 | 90(61) | 44 |
| కస్తూరిదేవి | 127 | 43(16) | 34 |
| సి.ఎ.ఎం. | 216 | 67(35) | 31 |
| సి.ఎం.ఎం. | 93 | 20(11) | 18 |

## 8 మంది మంత్రులు

సమాచార మంత్రి శ్రీ పనబాక పెంచలయ్య కుమార్తె వివాహానికి 8 మంది మంత్రులు హాజరైనారు; శ్రీ సమర సింహారెడ్డి, చంద్రశేఖర్, రామచంద్రా రెడ్డి, కోనేరు రంగారావు, రామిరెడ్డి, పాలి రాజం, కె. భీంరావు, సాంబశివ రాజు. ఆ రోజంతా నెల్లూరులో చెప్పలేని హడావిడి. అయితే ఎందువల్లనో ఏ మంత్రికి ఏ శాఖా కార్యక్రమాలు ఏర్పాటు చేయలేదు. సాయంత్రం వరకు గోళ్లు గిల్లుకుంటూ గెస్టుహౌస్‌లో కూర్చొని ఎవరి దారిన వారు పోయారు.

## కోవూరు జోస్యం

కోవూరు ఎన్నిక పై పెద్దపరుగు పాడుకు చెందిన సిద్ధాంతి శ్రీ విస్సకోట విజయకుమార్ ఒక జోస్యం మా చెవిలో వూదారు; ఇప్పుడే చెప్తే ఎన్నికల కమీషన్ శేషన్ అభ్యంతర పెడతాడేమో – ఓటర్లను ప్రభావితం చేసేస్తున్నారని; ఫలితం వెలువడిన తర్వాత జోస్యం నిజమైందీ కానిదీ చెప్తాం. అంతగా ఆత్రం పట్టలేని వారెవరైనా వుంటే మా ఆఫీసుకు రండి – సైగ్గా చెప్తాం!

## మా ఛాయిస్

మాజీ మున్సిపల్ కౌన్సిలర్లు, వ్యాపారి కార్యకలాపాల్లో విడివడని అపూర్వ ద్వయం వేణుంబాక సుధాకర రెడ్డి – పులిమి రత్నాకర రెడ్డి గారలు 'ఛాయిస్' ఐస్ క్రీమ్స్ షాపును పినాకిని సూపర్ మార్కెట్లో 12 తేది లాంఛ గడియల్లో జె.కె. రెడ్డి చేతుల మీదుగా ప్రారంభించారు. సింహపురి సేవా

కడప 7 పేజీలో

## చిరంజీవి త్రీ రోల్స్

తన స్వంత బ్యానర్ అయిన అంజన ప్రొడక్షన్స్‌పై నాగాబాబు నిర్మించనున్న, కె.రాఘవేంద్రరావు దర్శకత్వంలో నిర్మిస్తున్న చిత్రంలో చిరంజీవి తొలిసారిగా త్రిపాత్రాభినయం చేయనున్నారు. ఈ బ్యానర్ పై ఇంతకు ముందు తీసిన రుద్రవీణ, త్రినేత్రుడు ఆశించినంత విజయం సాధించని నేపథ్యంలో హంగు, ఆర్భాటాలతో ఏదో ఒక జిమ్మిక్ చేసే రాఘవేంద్రరావును దర్శకుడుగా ఎంచుకొన్నట్టు తెలుస్తుంది. క్రేజీ హీరోయిన్లు రోజా, నగ్మా లతోపాటు పెద్దరికం ఫేమ్ సుకన్య ఈ చిత్రంలో హీరోయిన్లుగా నటిస్తారని భోగట్టా.

## తెలుగులో భాగ్యరాజా

జన్మతః తెలుగు వాడైనా, ప్రఖ్యాత తమిళ దర్శక నటుడుగా పేరు పొందిన కె.భాగ్యరాజా తొలిసారిగా తెలుగు చిత్రంలో నటించనున్నారు. హీరో కృష్ణతో ఇంతకు ముందు 'జమదగ్ని' తీసిన నిర్మాతలు ఆయన దర్శకత్వంలో ఈ చిత్రం నిర్మిస్తున్నారు. జూన్‌లో షూటింగ్ ప్రారంభం. భాగ్యరాజా చిన్నరాజా, చిన్నిఇల్లు, చిలిపి మొగుడు డబ్బింగ్ చిత్రాల ద్వారా తెలుగు ప్రేక్షకులకు సుపరిచితుడే!

### అక్కినేని-చిరంజీవి ల మెకానిక్ అల్లుడు

మెగాస్టార్ చిరంజీవి బావమర్ది అల్లు అరవింద్ గీతా ఆర్ట్స్ బేనర్‌పై అక్కినేని-చిరంజీవి కాంబినేషన్‌లో నిర్మిస్తున్న సంచలన చిత్రానికి 'మెకానిక్ అల్లుడు'గా పేరు నిర్ణయించారు. చిరంజీవి- విజయశాంతిలపై తీసిన పాటలతోపాటు అక్కినేని పై తీసిన 'గురువా గురువా' పాట ప్రేక్షకులను అమితంగా ఆకట్టుకుంటుందని నిర్మాత చెబుతున్నారు. ఈ నెలలోనే విడుదల అయ్యే ఈ చిత్రానికి రాజ్-కోటి సంగీతం సమకూర్చగా బి.గోపాల్ దర్శకత్వ బాధ్యతలు నిర్వహించారు.



భగవద్గీత చిత్ర నిర్మాతగా రాష్ట్రపతి శంకర దయాళ్ శర్మ నుంచి జాతీయ స్థాయి ఉత్తమ బహుమతి స్వీకరిస్తున్న తిక్కవరపు సుబ్బరామరెడ్డి; ఉత్తమనటుడు మిథున్ చక్రవర్తి, ఉత్తమ నటి డింపుల్ కపాడియ.

# ఫక్తు కాపీ చిత్రం: వారసుడు

యువదర్శకుడు ఇ.వి.వి. సత్యనారాయణ ఇటీవల లోబడ్జెట్ చిత్రాలను బంపర్ హిట్లుచేసి తన ప్రతిభ చూపారు. కాని అగ్రనటులను పెట్టి భారీ బడ్జెట్‌తో నటుడు మురళీమోహన్ నిర్మించిన రీమేక్ చిత్రం 'వారసుడు' మాత్రం ఆ కోవలో చేరదు. వివిధ హిట్ సినిమాల పసందు సీన్లను ఏరి, మూలగా కొట్టి ప్రేక్షకుడి మెదలో వేసిన ఫక్తు కాపీ చిత్రం ఇది. సుందర కాండ సినిమాలో 20 ఏళ్ల నుండి ఒకే క్లాస్‌లో కొనసాగుతుండే స్టూడెంట్ సన్నివేశం ఇందులో పునరావృతమైంది. అదే విధంగా జంబలకడిపంబ లోని క్లాస్ రూం హాస్యం జత కలిసింది. గత నెలలో విడుదలైన మామకోడలు లోని మనవడి ప్రేమ ట్విస్ట్ ఈ చిత్రంలోని కథకు టర్నింగ్‌పాయింట్. హీరోయిన్, హీరోను ప్రేమిస్తున్నట్లు మైక్‌లో ప్రకటించడం, అదిక్లాస్ రూముల్లోని స్టూడెంట్లువినే సన్నివేశం ఇటీవల మరో సినిమాలో ప్రేక్షకులు చూసే వుంటారు. కామెడీ కోసమంటూ ఒక లెక్చరర్‌కి శ్రీదేవి ఫోటో చూస్తే గాని పాఠాలు చెప్పను మూడ్ రాక పోవడం, నాన్నా అంటూ ఒక పిల్లవాడు క్లాస్ రూంలో ఇరవై ఏళ్ల నుండి వుండే స్టూడెంట్ కోసం రావడం అతి సన్నివేశాలు. కథను ఒక్క రీల్‌లో ముగించే అవకాశం వున్నందున దర్శకుడు నానా హంగామాతో చిత్రాన్ని సాగదీయాల్సి వచ్చింది.

కెమరా మెన్ ప్రతిభ కొరవడడం వల్ల విదేశాల్లో తీసిన పాట ల్లో రంజు లేకుండా పోయింది. 'కుమారి భారతదేశం' అంటూ ఇక దారిన పోయే అందమైన అమ్మాయిలను అబ్బాయిలు గలభా చేసేవిధంగా ఒక పూత పదాన్ని మాత్రం మాటల రచయిత సృష్టించి వదిలాడు. చిత్రంలో చాలా లోపాలున్నా నటీ నటుల నుంచి సాధ్యమైనంత వరకు నటనను రాబట్టుకోవడంలో దర్శకుడు కృతకృత్యుడై నాడని చెప్పవచ్చు.

ఇక కథలోకి వెళితే చీకటి సామ్రాజ్యపు దాదా ధర్మతేజ (కృష్ణ) నిండు చూలాలుగా వుండే భార్య సీత (

> **చిత్రసమీక్ష**
> ****
> అల్లూరు రహీం

గీత) మాట వినకుండా స్మగ్లింగ్ చేయను 'సింగపూర్' వెళతాడు. స్మగ్లర్ భార్య అని ప్రసవ వేదన ననుభవిస్తున్న సీతను హాస్పిటల్‌లో చేర్పను చుట్టు ప్రక్కల ఇండ్ల వాళ్లు నిరాకరించి ముందుకు రాకపోవడంతో ఆమె మరణిస్తుంది. అప్పటి నుండి వినయ్ (నాగార్జున) తన తల్లిని చంపిన హంతకునిగా తండ్రిని భావిస్తూ అతనంటే కసి, పగ, ద్వేషం పెంచుకుంటాడు. కాని జైలు నుండి వచ్చిన ధర్మతేజ తన కుమారుడి పై అత్యంత ప్రేమను చూపిస్తూ, కాలేజిలో ఎమ్మెల్యే తారకం (తనికెళ్ల భరణి) మరో విలన్ కొడుకు (శరత్ సక్సేనా) తమ్ముడు వినయ్‌ను హతమార్చాలని చూస్తే వారినే తన గ్యాంగ్ ద్వారా హతమారుస్తాడు. తన క్లాస్‌మేట్ కీర్తి (నగ్మా)ప్రేమించి పెండ్లి చేసుకుని ఒక బిడ్డకు తండ్రి అయ్యి అన్యోన్యంగా సాగుతున్న సంసారంలో ఆ బిడ్డ కిడ్నాప్ అవడంతో భార్యాభర్తలు అల్లాడిపోతారు. తన శత్రువులు తన మనుమడ్ని కిడ్నాప్ చేశారని, కొడుకు, కోడలికి నమ్మబలికి వారిని రక్షణ కోసమంటూ తన ఇంటికి ఆహ్వానిస్తాడు ధర్మతేజ. కాని వినయ్ ససేమిరా ఒప్పుకోక పోయినా కీర్తి బిడ్డను రక్షిస్తాడని ఆశతో మామ పంచకు చేరుతుంది. కొడుకు, మనవడి పట్ల మామ చూపే ప్రేమను చూసి ఆశ్చర్య పడుతుంది. ఒకానొక సమయంలో మామ తన బిడ్డను కిడ్నాప్ చేశారని తెలుసుకొని ఆవేశపడుతుంది. చివరన ఆస్తి కోసమంటూ చిన్నబిడ్డను ఎత్తుకెళ్లిన విలన్లను తండ్రి, కొడుకులు కలసి చావతన్ని కోడలి ఒడిలో చేర్పుతారు. ఈ పోరాటంలో ధర్మతేజ కన్ను మూయడంతో కథ ముగుస్తుంది.

చిత్రంలో నాగార్జున, కృష్ణలవి పవర్‌ఫుల్ రోల్స్. ఇద్దరూ వీటికి ఒక రకంగా న్యాయం చేకూర్చారు. సామాన్యుని ఫిర్యాదులకు పోలీసులు స్పందించే తీరుపై ఆవేశపడి వారిని చితక తన్నడం, ప్లే గ్రౌండ్ ఫైట్స్, బాత్‌రూం ఫైట్స్‌లో నాగార్జున ప్రతిభ చూపారు. కరుకు తనం

కొరవ 11 పేజీలో

## నటి రోజా అదృష్టం

తిరుపతి తెలుగమ్మాయి ప్రస్తుత క్రేజీ స్టార్ రోజా ను అదృష్టవంతురాలనాలి. ప్రముఖ నిర్మాణ సంస్థ విజయవాహిని తెలుగు, తమిళంలో బాలకృష్ణ, రజనీకాంత్ లతోవేరువేరుగా నిర్మిస్తున్న రెండు చిత్రాల్లో హీరోయిన్ గా నటించే ఛాన్స్ దక్కింది. బాలకృష్ణతో తీసే జానపద చిత్రం భైరవదీపంలో ఆమె రాజకుమారి గెటప్‌లో కన్పించనున్నది. ఇవేగాక ఉప్పలపాటి నారాయణరావు తీసే లేడీ ఓరియెంటెడ్ 'సంభవం' పోకూరి బాబురావు 'అన్న' చిరంజీవి సొంత చిత్రంతోపాటు తన స్వంత 'సమరం'లో కూడా ప్రస్తుతం నటిస్తున్నది.

## హీరో కానున్న విలన్ నాజర్

గత సంవత్సరం చంటి చిత్రం ద్వారా ఉత్తమ విలన్‌గా రాష్ట్ర ప్రభుత్వ అవార్డ్ పొందిన నాజర్‌ను హీరోగా చేసిన ఘనత సంచలన నటుడు కమల్‌హాసన్‌కు దక్కింది. ఆయన తమిళంలో స్వంత బ్యానర్‌పై తీసే 'మగళిర్ మట్టుం' (స్త్రీ_లకు మాత్రమే)లో నాజర్ హీరో. హీరోయిన్లు కూడా ఒక్కరు కాదు ముగ్గురు; రేవతి, సరిత, ఊర్వశి. ఈ చిత్రానికి దర్శకుడు ఎవరనుకున్నారు? నెల్లూరీయుడు సింగీతం శ్రీనివాసరావు!

### గాయని 'చిత్ర' అభిమాని ఎవరో తెలుసా?

ఇటీవల ఏ చిత్రం చూసిన అందులోని పాటలకు వినిపించేది 'చిత్ర'గానమే. కోయిల కంఠాన్ని పోలి ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేస్తున్న కంఠం కావడంతో నిర్మాతలు కూడా 'చిత్ర'కే అవకాశాలు ఎక్కువగా యిస్తున్నారు. ఇంత ఎదిగినా అణుమాత్రం భేషజం చూపించని గాయని చిత్ర. దీనికి ఉదాహరణ ఇటీవల జరిగిన ఒక కార్యక్రమం. అందులో పాల్గొనడానికి వచ్చిన మధుర గాయని జానకిని చూచిన చిత్ర ఆమె కాళ్లకు నమస్కరించింది. ఇద్దరు గాయనీమణులు కలిసి పాడిన సభలో చిత్ర తన అభిమాన గాయని జానకి అని చెప్పింది.

# సారా నిషేధం

## మీ శ్రేయస్సు కోరి మీ ప్రభుత్వం తీసుకున్న చారిత్రాత్మక నిర్ణయం





'చైతన్యశీలి' ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారి నాయకత్వంలో రాష్ట్ర ప్రభుత్వం 1993 అక్టోబరు 1 నుంచి రాష్ట్రమంతటా సారా వాడకంపై, అమ్మకంపై నిషేధం విధించింది. నెల్లూరు జిల్లాలో ఈ నిషేధం వెంటనే అమలులోనికి వచ్చింది.

సారా వ్యసనం నుంచి బడుగు, బలహీన వర్గాల వారిని కాపాడాలనే సదుద్దేశంతోనే సారా నిషేధ నిర్ణయం తీసుకుంది ఈ ప్రభుత్వం.

పేదల జీవితాలతో చెలగాటమాడే సారా మహమ్మారికి అంతం పలికింది-ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.

మున్సిపల్ పట్టణాల్లోనూ చుట్టూ 5 కి.మీ. పరిధిలో తాటిచెట్లు లేని గ్రామ ప్రాంతాల్లో నూ కల్లు వాడకం, అమ్మకాన్ని కూడ నిషేధం విధించారు.

రూ. 600 కోట్ల వార్షిక ఆబ్కారి ఆదాయం కన్నా పేద ప్రజల ఆరోగ్యం, సంక్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని సంపూర్ణ సారా నిషేధాన్ని విధించింది ప్రభుత్వం.

సంపూర్ణ సారా నిషేధం అనే సాహసోపేత నిర్ణయం విజయవంతం కావడానికి అన్నివర్గాల ప్రజల సమైక్య సహాయ, సహకారాలు అవసరం. ముఖ్యంగా సంఘ సంస్కరణాభిలాషులు, స్వచ్ఛంద సేవా సంస్థలు, మేధావులు, మహిళా సమాజాలు, యువతరం సారానిషేధం అమలుకు తమ సంపూర్ణ సహకారాన్ని అందించాలి.



Issued by the Commissioner, Information & Public Relations

## సణుగుడు

(4 పేజీ కొరవ)

ప్రాయించి విని మనుషులను కోళ తెపతారు.

యాజమాన్యాలకు కావలసింది అధిక సంఖ్యలో పాసులు – అంతే! ఎంత ఎక్కువ మంది పాసైతే ఆ సెంటరుకు అంత మంచి పేరు; ఆ పై సంవత్సరం అంత ఎక్కువ మంది విద్యార్థులు; అంత ఎక్కువ డబ్బు; పాసుల శాతం పెరిగే కొద్దీ ఫీజుల మొత్తం పెంచవచ్చు; లాభార్జించవచ్చు. ఏ యాజమాన్యానికి ఈ యావ, ఈ రంది మినహా, మరొక దృష్టి వుండదు. మరొక ఆలోచన వుండదు!

చదువుల పేరుతో తమ బుల్లి మనసుల పై పడే లోడ్ భరించలేక ఎందరు పసి పిల్లలు మానసికంగా వంచలబై పోతున్నారో చెప్పలేము. వారి ఆలోచనా పరిధి పాఠ్య పుస్తకాలకు మాత్రం కుదించుక పోతున్నది. కోచింగ్ స్కూళ్లు వారి పాలిట జైళ్ల వలె తయారౌతున్నాయి.

పిల్లల వింత క్షోభ పెట్టి, ఇంత యాతన పెట్టి, బాల్యంలో వారి హక్కులైన ఆట పాటలను నిరాకరించి, తల్లిదండ్రులు కాని, స్కూళ్ల యజమాన్యాలు కాని సాధిస్తున్నదేమిటి?

నెల్లూరు జోన్‌లో ఫలితాలు వివరాలు తెలిసిన పదిహేను సాధారణ స్కూళ్లు, చదువుల అంగళ్ల ఫలితాలను పోల్చిస్తే ఈ మోజు ఎంత మూర్ఖమైనదో అర్థమౌతుంది. ఈ పదిహేనింటిలో ఐదు స్కూళ్లు నూరు శాతం, ఆరు స్కూళ్లు 90 శాతం పైన, 3 స్కూళ్లు 60 శాతం పైన రిజల్ట్సు సాధించాయి. నూరు శాతం సాధించిన వన్నీ ప్రైవేటు స్కూళ్లే! కాని ఆ యజమాన్యాలు తమ స్కూలు తరఫున పరీక్షకు హాజరైన విద్యార్థుల సంఖ్యనంతటినీ నిజాయితీగా చెప్తున్నాయా, లేక పాసైన వారి సంఖ్యే హాజరైన వారి సంఖ్యగా ప్రచారం చేసుకుంటున్నాయా అన్నది సందేహం. చాలా స్కూళ్లు చేసే చాలా సాధారణ ప్రచారం ఇది. నూరు శాతం సాధించామని చెప్తున్న ఐదు స్కూళ్లలో మూడింటి తరఫున హాజరైన విద్యార్థుల సంఖ్య 15 లోపే! కేవలం ఇద్దరో ఇద్దరు విద్యార్థులతో పదవ తరగతి క్లాసు నడిపితే ప్రైవేటు స్కూలుకు నష్టం వస్తుందా? లాభం వస్తుందా? తమ స్కూలు తరఫున హాజరైంది ఇద్దరు లేక ముగ్గురని వారు చెప్తే మనం నమ్మడం సమంజసమా? అందువల్ల ఈ ఫలితాలను నమ్మను కాక నమ్మలేం! అది నిజమని నమ్మినా చదువు దుకాణం కాకుండా, మామూలుగా పాఠాలు చెప్పే స్వామిదాసు, సైంట్ జోసఫ్స్, శాంతినికేతన్, శారదా, బాలాజీ, విశ్వభారతి స్కూళ్లు కూడా 90 శాతం పైన ఫలితాలు సాధించాయి. ఇవి ప్రైవేటు బడులని సమర్థించ జూచుకుంటే – బండెల రొడ్డుగా పేరు పడిన విఆర్‌సి, సైంట్ పీటర్స్, మూలపేట గరల్స్, సిఎఎం, సైంట్ జోసఫ్స్ ఇంగ్లీషు, తెలుగు మీడియం స్కూళ్లలో 382 మంది ఫస్ట్ క్లాసులో పాసైనారు. నూరు శాతం ఫలితాలు సాధించిన ఐదు చదువు లంగళ్లలో ఫస్ట్ క్లాసులో పాసైన వారి సంఖ్య 274; మాత్రమే మామూలు బడులలో చదువుకున్న 64 మంది ఫస్ట్ క్లాసులో పాసైతే, 3 నుంచి 10 వేల వరకు ఫీజుల రూపంలో కప్పం దండే ఈ బడులలో ఈ సగటు సంఖ్య కేవలం 54.

విఆర్‌సి, సిఎఎం వంటి స్కూళ్లలో చదువు సరిగా చెప్పరని పేరు; పిల్లలను పట్టించుకోరని, చెడి పోతారని ప్రచారం; అందువల్లే ఒక మోస్తరు ఆదాయం వున్న కుటుంబాల వారెవరూ తమ పిల్లలను వాటిలో చేర్పించరు; వాటిలో స్పెషల్ క్లాసులుండవు; స్పెషల్ ట్రీట్‌మెంట్ వుండదు; నెలకు పదో, పాతికో కడితే చదువు చెప్పేస్తారు. అయినా ఆ స్కూళ్లలోని విద్యార్థులు ఫస్ట్ క్లాసులో పాసౌతున్నారు; ర్యాంకులు తెచ్చుకుంటున్నారు; జీవితంలో పైకి వస్తున్నారు; పై చదువులు చదవ గల్గుతున్నారు.

రాష్ట్రం మొత్తం మీద వచ్చిన 10 ర్యాంకులలో కూ ప్రభుత్వ ఆధ్వర్యంలో నడిచే రెసిడెన్షియల్ స్కూలు విద్యార్థులు నలుగురైతే, సాధారణ స్కూళ్ల విద్యార్థులు ఆరుగురు; అందులో ఒక విద్యార్థి శ్రీకాకుళం వంటి వెనుక బడిన జిల్లాలోని మారుమూల గ్రామమైన రేలపేట జిల్లా ప్రజాపరిషత్ స్కూలులో చదివిన వాడు. ఈ విశ్లేషణను అర్థం చేసుకోగల్గితే కోచింగ్ సెంటర్ల మోజుకు అర్థం మిగులు తుందంటారా?

## జయంతి సభ

(4 పేజీ కొరవ)

ఈ సభకు అధ్యక్షుడు డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారు "కాళిదాసు కాలంలో నేను పుట్టి వుంటె దశమ రత్నంగా భాసించి వుండే వాణ్ని" అని ధైర్యంగా చెప్పుకో గల్గిన కవి ఠాగూర్ ఒక్కడే నన్నారాయన ; ఆయన ఆలోచనల్లోని సౌందర్య పరాకాష్ఠకు 'ఊర్వశి' ప్రతిబింబం గావడం అబ్బుర పరుస్తుందని, ఠాగూర్ వ్రాసిన 11 పద్య కావ్యాలు తాను తెలుగులోకి అనువదించ గల్గినందుకు గర్వ పడుతున్నానని అన్నారు గోపాల్ రెడ్డి గారు.

శ్రీ రమణారెడ్డి తన తల్లి స్వర్గీయ పూనూరు వెంకట సుబ్బమ్మ పేరిట ఇచ్చే సత్కారాన్ని ప్రొఫెసర్ నాగేశ్వర రావుకు అందించారు; శ్రీ ఇలపావులూరు పినాకపాణి ప్రార్థనతో స్వాగతిస్తే వర్ధమాన సమాజం కార్యదర్శి శ్రీ బి.వి. నరసింహం వందనాలు చెప్పారు.

## విశ్వవిద్యాలయం

(4 పేజీ కొరవ)

పోయింది. జనార్థన రెడ్డి ముఖ్యమంత్రిగా కొనసాగివుంటే తెలుగు విశ్వవిద్యాలయం కేంద్రమే కాదు, మెడికల్ కాలేజి వంటి ఎన్నో సంస్థలు నెల్లూరుకు లభించి వుండేవి. రాజకీయ ప్రత్యర్థులు సంతోషించి వుండ వచ్చు గాని, జనార్దన రెడ్డికి ముఖ్యమంత్రిత్వం పోవడం నెల్లూరుకు దురదృష్టమే!

తెలుగు విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో శ్రీశైలంలో చరిత్ర పీఠం; రాజమండ్రిలో సాహిత్య పీఠం, హైదరాబాదులో లలిత కళాపీఠం ఇది వరకే ఏర్పడ్డాయి. జరిగింది జరిగి పోయింది. ఇప్పుడైనా నెల్లూరు మేధావులు స్పందించాలి; ప్రజలు ఆందోళన చేయాలి; పార్లమెంటు సభ్యులు, శాసనసభ్యులను కదిలించి, అవసరమైతే ప్రభుత్వం వద్దకు రాయబారం పోవాలి; మంత్రి వనల పెంచలయ్య వున్నారు. ఈ కేంద్రానికి ప్రేరకుడైన పూర్వపు ముఖ్యమంత్రి జనార్థన రెడ్డి గారున్నారు. హైదరాబాదుకు పోలేకపోతే, నెల్లూరులోనైనా వీరివి గట్టిగా పట్టుకొని తెలుగు విశ్వవిద్యాలయం కేంద్ర స్థాపనా సంకల్పాన్ని నిజం చేసుకోవాలి. కేంద్రం స్థాపించేట్లయితే దానికి అవసరమైన స్థలము, తాత్కాలిక భవనాలు వగైరాల విషయంలో సహకరించుటకు ఎందరో సంపన్నులు, మంచి పనులకు ఎల్లప్పుడూ తన సహకారాన్నిచ్చే కలెక్టరు శ్రీ ఎం. సాంబశివరావు గారున్నారు. వైస్ ఛాన్సలర్ ప్రకటించిన ఈ కేంద్రాన్ని సాధించుకోలేక పోతే నెల్లూరీయులకు అంతకంటె అవమానం వుండదు.

– ఒక మేధావి

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

చెదరనీయక హృదయంలో పొంగే ప్రేమను ఆణచుకోలేక పడే తపనతో నిండిన పాత్రను కృష్ణ హుందాగానే పోషించాడు. కాని పాత్ర నిడివి తగ్గడంతో ఆయన అభిమానులు చేస్తున్న ఆగడం వల్ల పాపం ఆయన పత్రికా ప్రకటనలు కూడా ఇచ్చుకోవలసి వచ్చింది. అందాలు విరజిమ్మే పాత్రలలోనే ఇంత వరకు కన్పించిన నగ్మా చిత్రంలో ఒక బిడ్డ తల్లిగా ఫరవాలేదని పించింది. తవొళ్ల భరణి విలనీయం ఏడ్చినట్లుంది. బాబూమోహన్, బ్రహ్మానందం జంట యథాతథ నటన చూపారు. సాంకేతిక నిపుణుల్లో ఎల్.బి. శ్రీరాం మాటలు పరవాలేదు. కాని ఛోటా కె. నాయుడు కెమెరాలో పనితనం కొరవడింది. కీరవాణి సంగీతం, అశోక్, ప్రభుల నృత్యం అంతంత మాత్రం. 'పాప హలో హలో' పాటలో నగ్మా అందాల కనువిందుకు పిక్కల పిటపిట లంటూ సరస సాహిత్యం తోడయ్యింది. ఏది ఏమైనా పాత, కొత్త తరం నటుల కాంబినేషన్ ఆశించి చూద్దామనిపోయే ప్రేక్షకులు ఉసూరుమంటూ తిరిగి వచ్చేలా దర్శకుడు ఇ.వి.వి.సత్యనారాయణ చిత్రాన్ని తీసాడన్నది మాత్రం నిజం.



## అశ్రుతర్పణం

నెల్లూరులో ప్రముఖ బిల్డింగ్ సర్వేయర్, మా తండ్రి

### రేవూరు సుబ్రహ్మణ్యం గారు

8.5.93 తేది శనివారం స్వర్గస్థులైనారు.

దశాహస్సు

17.5.93 తేది సోమవారం, నెల్లూరు దర్గామిట్ట డోర్ నం. 24/1681 గల మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.



జననం: 26.9.1910

**రేవూరు రామమోహన రావు, రవికిషోర్, అరుణ్ కుమార్**

## నెల్లూరు సబ్ కోర్టులో

O.S. 113/92

సిండికేటు బ్యాంకు, నెల్లూరు – వాది

Vs

1. సయ్యద్ సర్దార్ వగైరా

– ప్రతివాదులు

1. సయ్యద్ సర్దార్, S/o. రజాక్ బాష, 22/119, టైకస్ రోడ్డు, నెల్లూరు.

పై నంబరు వారి మీ మీద దావా బాకీ రాబట్టుకొనుటకు దావా దాఖలు చేసినందున యిందు విషయమై నీకు నోటీసు నిమిత్తం 8.6.93 తేదిన వాయిదా వేసినారు. కాన ఆ రోజు ఉదయం 10.00 గంటలకు పై కోర్టు వారి ఎదుట హాజరై మీకు గల ఆక్షేపణలు తెలుపుకో వలసినది. లేని ఎడల మీ పరోక్షమందు తీర్మానించబడును.

**M. Raveendra Reddy**

Advocate for Plantiff



## పబ్లిక్ నోటీసు

ఇందు మూలముగా యావన్మందికి తెలియజేయడ మేమనగా

మా కక్షిదారులు అయిన కోట్ల జానకి రాము, కోట్ల సత్యనారాయణ అను వారలకు వారి అన్నదమ్ములు మరియు చెల్లెళ్లకు జాయింటుగా హక్కు కలిగిన గూడూరు టౌన్ హాస్పటల్ రోడ్డులో పాత డోరు నెం. 13/262, క్రొత్త డోరు నం. 13/263, గల ఇంటిని హక్కుదారులు ఇరువురు మాత్రమే మిగిలిన భాగస్తులకు తెలియకుండా అమ్ముటకు ప్రయత్నించు ...ట్లు తెలియు చున్నది. అట్లు ఎవరైనా మా కక్షిదారులను సంప్రదించకుండా ...ఇంచుకొనిన ఎడల సదరు విక్రయము మిగతా భాగస్తులకు బద్ధగించదు అని తెలుపడమైనది.

సి.వి. సుబ్బారెడ్డి,

గూడూరు అడ్వొకేటు

## ప్రకటన

నెల్లూరు జిల్లా, కలువాయి మండలం, కనుపూరు పల్లి మజరా వేరు బొట్ల పల్లె వాస్తవ్యుడు పేరం పెంచల రెడ్డి కుమారుడు పెంచల నరసారెడ్డి ఈ ప్రకటన ద్వారా తెలియపరుచునది.

మా తండ్రి గారు వయస్సు 70 సం. మనస్థిమితం లేక ఇల్లు వదలి తిరుగుతున్నారు. మా కుటుంబమునకు ఉన్న ఉమ్మడి స్థిరచర ఆస్తులను మాకు తెలియకుండా పరాధీనము చేస్తాను అని చెప్పుచున్నారు. మా ఉమ్మడి కుటుంబమునకు సంబంధించిన ఆస్తులను మా తండ్రి పరాధీనము చేసిన చెల్లవు అట్లు ఎవరైనా సదరు ఆస్తులను కొనిన నేను తీసుకొను సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులు అవుదురు.

వై. చంద్రశేఖర్ రెడ్డి

నెల్లూరు అడ్వొకేటు

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore. OFFSET Printing at Nayagara Books (P) Ltd.